శ్రీరస్తు.

# కావ్యవిషయసంగ్రహము.

ఇది

శ్రీమాన్ కొమాండూరు - అనంతాచార్యులుగారిచే

హాపాలీయము కావ్యాలంకారచూడామణి మున్నగు లక్షణగ్రంథములయంద

కావ్యవిషయములను సంగ్రహించి రచింపఁబడినది.

---

వైజయంతియందుఁ బ్రచురితము.

---

చెన్నపురి:

శ్రీవైజయంతి ముద్రాశాలన్ ముద్రితము.

1897.

వెల 4 అణాలు. 

(16) విరుద్ధార్థము తోఁచుపదము విపరీతధీప్రదము.

ఉ. "అకులహీనుండగు నితఁడు, అంబికావిటాసక్తుఁడు"—ఇందు కులహీనవిట శబ్దములు విపరీతములు.

కొందఱు దీనినివదలి విరుద్ధభాషితమును గ్రహించియున్నారు. ఉ. "మిత్రుఁడుడయింపఁగువలయోత్సేక మొదవె"—ఇందు మిత్రకువలయశబ్దములు విరుద్ధములు.

(17) పామరజనులు సాధారణముగా వాడునట్టి శబ్దము గ్రామ్యము.

ఉ. "భామినికటిగల్లములు విభాసిల్లును, కోమలిచన్నుఁబిగన్నులు కామునిపండువులొనర్చ"—ఇందు పదములకు పరిస్పరము అన్వయముపొసఁగమిచేత గ్రామ్యత్వము.

## ౪. వాక్యగతదోషములు అక్రమాదులు ఇరువదిరెండగు.

వాక్యమును బొందెడిదోషములు అక్రమము, విసంధికము, పునరుక్తియుతము, వ్యాకీర్ణము, భిన్నవచనము, భిన్నలింగము, ఛందోభంగము, యతిభంగము, న్యూనోపమ, అధికోపమ, న్యూనపదము, అధికపదము, సమాప్తపునరాత్తము, అశరీరము, ప్రక్రమభంగము, పతత్ప్రకర్షము, వాక్యసంకీర్ణము, వాచ్యవివర్జితము, అరీతి, అస్థానసమాసము, సంబంధవర్జితము, వాక్యగర్భితము అని యిరువదిరెండగును.

(1) క్రమముతప్పిన శబ్దముగాని యర్థముగాని కలిగినవాక్యమక్రమము.

ఉ. "శ్రీవిష్ణువర్ధనాఖ్య స్థావరుకీర్తిప్రతాపమహిమలతో రాజీవేందిరపరమిత్రులు కావింతురుచెలిమి"—ఇందు కీర్తిప్రతాపములతో ఇందీవరరాజీవమిత్రులు చెలిమికావింతురని చెప్పవలసియుండఁగా రాజీవేందీవరమిత్రులు చెలిమికావింతురనుట అక్రమము. ఇది క్రమభంగమనియుఁ జెప్పఁబడును.

(2) లక్షణవిరుద్ధమును గ్రామ్యమునైన సంధిగలవాక్యము విసంధికము.

ఉ. "కులయంబుజబాన్కుఁడిలబలియింద్రయుదారులు, అరిగెన్న పరగిరికినుండు"—ఇందు కులాంబుజబాన్కుఁడు బలీంద్రోదారులు అరిగెనపరగిరికి అనియుండవలసినవాక్యములు కులయంబుజ మొదలగురూపమునుండుట విసంధి.

(3) చెప్పినశబ్దార్థములే మరలఁ జెప్పఁబడు వాక్యము పునరుక్తియుతము.

ఉ. "చక్రిచక్రాయుధుఁడుపోరుసలుపుచోట శార్ఙ్గచాపాస్త్రిఁడాజి నెసంగునెడల"—ఇందు చక్రిచక్రాయుధుఁడు శార్ఙ్గచాపాస్త్రిఁడు అనునవి పునరుక్తులు.

(4) అన్వయమునందు భ్రమపుట్టించువాక్యము వ్యాకీర్ణము.

ఉ. "తలలవరాహాంకమురం బులనాజ్ఞయుఁదాల్చివిశ్వ భూవిభుఁగొలువం దలఁ పుదురరులు"—ఇందు తలలనాజ్ఞయు ఉరంబుల వరాహాంకముఁ దాల్చి యన్వయింపవల యును. ఇట్టి యన్వయమునందు భ్రమమీవాక్యమునఁ గలదుకనుక వ్యాకీర్ణము.

(5) విశేషణవిశేష్యములు వచనభేదము గలిగియుండువాక్యము భిన్నవచనము.

ఉ. "అనిశభంగంబులునునసేవ్యములునైనయంబునిధులెల్లగంభీరమరిమనంబు"—ఇందు అనిశభంగములు మొదలగునవి బహువచనాంతములును గంభీరమరిమనంబు అనునది యేకవచనాంతము నయియున్నది.

(6) మహత్తు నమహత్తుతోను అమహత్తును మహత్తుతోను బోల్చిచెప్పఁబడునది భిన్నలింగము.

ఉ. "చాళుక్యవిభుఁడుపనుపఁ ద్రిశూలంబును బోని సేనశూరతచేతఁ గూలుదురు వైరులనిలో"—ఇందు త్రిశూలసేనాశబ్దములకు భిన్నలింగత్వము.

(7) ఛందస్సుచెడినవాక్యము ఛందోభంగము.

ఉ. "ఎందును నీరాజునకే, చందంబునలేరు సరిజగములనెల్లన్ సుందరతనుశూరతను"—ఇందు సరిజగములనెల్లన్ అనుచోట ఛందోభంగము.

(8) ఏపద్యమున కేతావున యతినియతమో ఆపద్యమునకాతావున యతిలేకున్నయెడ యతిభంగమనంబడు.

ఉ. "చెప్పినయెడనిలుపకవడి, దప్పినయతిభంగమనఁగఁ జనుఁదత్కృతినీచొప్పెఱుంగుఁడు"—ఇందు దకారమునకుఁ దకారవర్గములేక చకారవర్గముండుటవలన యతి భంగము.

(9) తక్కువైన యుపమానముగలది న్యూనోపమ యనంబడు.

ఉ. "చంద్రతారాభిరామమైచదలువొలిచెఁ,బుండరీకాంక కాసారఖండమనఁగ"—ఇందు చదలునకు కాసారఖండము తక్కువైనయుపమానము.

(10) అధికమయిన యుపమానముగలది యధికోపమ యనంబడు.

ఉ. "వికలముఖులైవయరివధూటికలుగ్లాంత నలినకైరవకల్హారజాలభంగులైరి"—ఇందు కైరవశబ్ద ముపమకు నధికము.

(11) పదము తక్కువైనవాక్యము న్యూనపదము.

ఉ. ‘‘పరగండభైరవునిశ్రీ చరణంబుల కెరఁగకున్న సమకూరవనేచరిత’’—ఇందు అరులకు అనుపదము తక్కువ.

(12) ఉండవలసినంతకంటె నెక్కువపదములచేరికగలవాక్య మధికపదము.

ఉ. ‘‘కరవాలభైరవునిచే నరుగుడు రరులర్కమండభాకారములో సురిఁగి’’—ఇందు ఆకారములో అనునది యధికము.

(13) ముగించియు మరలఁగూర్చినపదములుగలవాక్యము సమాప్తపునరాత్తము.

ఉ. ‘‘అవనీశుయశముగుణమణినివహంబులు నెగడ నెగడనిఖిలమునిండెఁ గవివినుతులచేధవళితభువనంబు’’—ఇందు నిఖిలమునిండెననుక్రియతో ముగిసినవాక్యముతో కవివినుతులచే ధవళితభువనంబు అనుపదములు నన్వయించునవియై వెనుకఁజేరియున్నవి.

(14) క్రియలేనివాక్య మశరీరము.

ఉ. ‘‘కుశలుఁడగునృపతిసతతము కృశకులధర్ములను సహజకృత్రిమగుణులఁ బిశునుల’’—ఇందు శిక్షింపననుక్రియాపదములేదు.

(15) అనుక్రమములేనివాక్యము ప్రక్రమభంగము.

ఉ. ‘‘నారలుచీరలుమధురాహారంబులుకూరలడవియాలయము.’’—ఇందు నారలు మొదలగుశబ్దములవలె అడవియాలయశబ్దములు బహువచనములుగాక యేకవచనములుగా నుండుటప్రక్రమభంగము. ‘‘శౌరిదానవారిచక్రధారి, నభవుఁ డమితవిభవుననవద్యచారిత్రు, విష్ణుఁగొల్తుజిష్ణుఁగృష్ణు.’’ ఇందు అభవునిత్యాదివాక్యమునందు అనుప్రాసముచెడుట ప్రక్రమభంగము.

(16) ప్రకర్షముతోఁచనివాక్యముపతత్ప్రకర్షము.

(ప్రకర్షము – ఆధిక్యము = మేలిమి.)

ఉ. ‘‘ఏచిమార్కొనుపులులఁద్రొవ్వెసఁగుపులులఁ, బొఱుమృగములఁద్రుంచు నీభటుఁడు’’ అనునిట్టివాక్యమునందు విపరీతమార్గమునఁజెప్పుట పతత్ప్రకర్షము. ‘‘గవయభల్లూకమృగీవితతివిభేదనగర్వాయతసింహాభీలమీమహాటవి.’’—ఇందు గవయభల్లూకమృగీవితతిచేతభేదనమనుటవలన పతత్ప్రకర్షము.

(17) రెండువాక్యములను సంబంధించినపదములు
పరస్పరముకలయఁగూర్పఁబడునెడ
వాక్యసంకీర్ణము.

ఉ. “ పొగడుదురీభూకాంతుఁడుజనులెల్లననేకగుణాన్వితుఁడటంచు.”—ఇందు ఈభూకాంతుఁడు అనేకగుణాన్వితుఁడటంచు జనులెల్లఁబొగడుదురు అను రెండువాక్యములపదములు ముందువెనకలుగాఁగలయఁబడియున్నవి.

(18) వాచ్యవిరహితమైనవాక్యమువాచ్యవివర్జిము.

ఉ. “ ఆజినభవునైనఁదెగడునితనిబాహుదీప్తాసి” అనిచెప్పవలసినచోట ఆజినభవుదెగడును అనిచెప్పినపక్షమున వాచ్యవర్జితమగును. ఐనన్ అనునది యిందువాచ్యము. (వాచ్యము = వచింపఁదగినది.)

(19) రసమున కనుగుణముగానిపదముల కూర్పగలవాక్యము అరీతి.

ఉ. “ విటజనహృదయగ్రసనాగ్రహగ్రహిళదృష్టిసముగ్రోదగ్రమతివశృంగారము” ఇందు శృంగారమునకు అనుగుణముగాని వర్ణాడంబరము అరీతి.

(20) సమాసస్థానమునందుఁ గూర్పరానిపదములు కూర్చినవాక్య మస్థానసమాసము.

ఉ. “ రిపులననిఁదునిమెదనేనిపుడని వికటభ్రుకుటీవిపులక్రోధాంధుఁడయ్యె వీరుండు ”—ఇందు వికటభ్రుకుటీత్యాదిసమాసము అస్థానము.

(21) పరస్పరసంబంధములేనిపదములతోడివాక్యము సంబంధవర్జితము.

ఉ. “ కరులు శైలములు తురంగంబులు భంగంబులు సమరాంబుధిపరితరణియితనియసి ”—ఇందు శైలాదిశబ్దములకు ఒకటొకటికి సంబంధము కానఁబడదు.

(22) నడుమనొకవాక్య మడఁగియుండువాక్యము వాక్యగర్భితము.

ఉ. “ ఖలులౌ వెడమతులతోడిసంగతికడుహితమిదినీకొనర్పఁగావలదు ”—ఇందు కడుహితమిది అనునది గర్భవాక్యము.

కొందఱమతంబున నిందుఁగొన్నిదోషంబులు గ్రాహ్యంబులుగావు.

## ౫. అర్థగతదోషంబు లపార్థాదులు పదునేడు.

అర్థమునఁబొందు దోషములు అపార్థము, వ్యర్థము, హీనోపమము, అధికోపమము, ససంశయము, ఏకార్థము, అతిమాత్రము, భిన్నము, అపక్రమము, పరుషము, అసదృశోపమము, అప్రసిద్ధోపమము, హేతుశూన్యము, విరసము, నిరలంకృతి, విరుద్ధము, అసంగతి (సహచరచ్యుతము) అశ్లీలము అని పదునెనిమిదిదోషములు అగును. కొందఱు సహచరచ్యుతాశ్లీలములనుత్రోసి పదియేడే దోషములందురు. మఱికొందఱు సహచరచ్యుతమే అసంగతి యశ్లీలమును జేరఁగా పదునెనిమిదియందురు.

(1) సముదాయార్థశూన్యము అపార్థము.

(సముదాయము = పదసముదాయము - వాక్యము.)

ఉ. క॥ ధనదునకు నెందఱంగన, లనుములు నానకి మునఁ బంధనా పాతాళం, బునఁ బాములెన్ని గలవో, యనఁగ నపార్థంబు వాచికార్థము లేమిన్"—ఇందు చెప్పఁబడిన యర్థమిది యని యేర్పడినది కాదు గనుక అపార్థము.

(2) ప్రయోజనము లేని యర్థము వ్యర్థమనంబడు.

ఉ. "తే॥ మీరు పెద్దలు కులము మీ పౌరుషంబు । విశ్రుతంబులు గుణములీ వితతులేల। యధిపుఁ గొలువను దారనవ్యర్థమయ్యెఁ । దొలుత పలుకులు భజన హేతువులు గావు."—ఇందు రాజును గొలుచుటకు కారణములు గాని మాటలు నిరర్థకములు. "ఫేనిలంబైన జలధిదాఁటె ననిలతనయుఁడు"—ఇందు ఫేనిలత్వము వ్యర్థము.

(3) హీనమయిన యుపమగలది హీనోపమము.

ఉ. "కుక్కలను బోలె దనుజులు, మిక్కుటముగఁ గదిరి సురలు మృగములభంగిన్, దిక్కులు చెడి పాఱిరి."—కుక్కలను బోలెనను నెడ హీనోపమము.

(4) అధికమయిన యుపమగలది యధికోపమము.

ఉ. "అకుటిలగతిఁ గొలఁకులలో, బకములు మునివరులఁ బోలెఁ బరఁగె."—ఇందు బకములు మునివరులను బోలెననుట అధికోపమము.

(5) వాక్యార్థసంశయము గలయెడ ససంశయమగు.

ఉ. "నీవన్న పలుకు చెప్పను నా వెలఁదికి నలుగ నేల యనసంశయమై భావింపఁబడు నీవను, నా వెరవు సనన్నగామి నన్యార్థంబై"—ఇందు అన్నయను ఏ అన్నయా చెప్పుటయా అను సంశయము కలుగుటచే నిట్టిది ససంశయము.

(6) భేద మేర్పడని వాక్యార్థ మేకార్థము.

ఉ. "మలయసమీరము మలసెను మలగొనియెఁ బటీరశైలమారుతము"—ఇందు మలసెను మలగొనియెను అనువానియందేకార్థము.

(7) లోకసామాన్యమును మీఱిన యర్థము అతిమాత్రము.

ఉ. "ఏకోదకమునఁ జెడు జగమును మన్ మితముగ నరిసతులేర్చినఁ బ్రతతా కృతి నదులు పర్వె బాష్పజలములన్" ఇందు మితముగ నేడ్చిన బాష్పజలముల నదులు పర్వెననుట యతిమాత్రము.

(8) సంబంధము లేని యర్థము భిన్నము.

ఉ. "నలువభవదహితకీర్తులు నలుపులుగావించుతలఁపునంజేసినుమీ, మలినత్వము కుజనమనఃస్థలములనిడెను"—ఇందు అహితకీర్తులకును కుజనమనస్థ్సలులకు సంబంధము గానఁబడదు.

(9) క్రమముతప్పి ముందు వెనుకలుగా నుండునట్టియర్థ మపక్రమము.

ఉ. "పురుషుఁడొక్కండుపరిణయంబునకుమున్న వరుసనమకూర్చెసీమంతపరికరములు"—ఇందు పరిణయమునకు ముందె సీమంతపరికరములుగూర్చుట అపక్రమము.

(10) అతిక్రూరమయినయర్థము పరుషము.

ఉ. "వేఁడెదునర్థులఁగనుఁగొ వాఁడికటారమునఁజెండెవలదా"—ఇందు అర్థులను గనుఁగొనఁగా కటారమున నఱకుట క్రూరమయినయర్థము.

(11) ఈడుకాని యుపమగలయర్థ మసదృశోపమము.

ఉ. "వసుధాపతికోపాగ్ని ప్రసరంబులచేతరజత పర్వతభంగిక్ష వెసవెలిఁగెఁబోరక్ష"—ఇందు అగ్నిప్రసరములును రజతపర్వతములును అసదృశములు.

(12) ప్రసిద్ధముగాని యుపమగలయర్థ మప్రసిద్ధోపమనాఁబడు.

ఉ. "బాష్పకణకీర్ణమైయొప్పుపణఁతిమోము మంచునిండినతొగపువ్వమాడ్కి"
ఇందు ముఖమునకును తొగపువ్వునకును ఉపమాత్వమప్రసిద్ధము.

(13) హేతువులేక చెప్పఁబడునర్థము హేతుశూన్యము.

ఉ. "చర్మగోరక్షణార్థంబుచంపుఁబులుల ననకమిన్నకిపులివేఁటలాడు నృపుఁడు శూరుఁడైయున్నదిహేతుశూన్యమయ్యె"—ఇందు హేతువులేమి తేటపడుచున్నది.

(14) ప్రస్తుతరసయుక్తముకానిది విరసము.

ఉ. "తలఁపవుచూపులునిద్దపుటెలనగవులునింతయొప్పనేభయమున నిశ్చలుఁ గను నదిసతులకు"—ఇందు భయమునకు ప్రస్తుతమయిన రౌద్రరసము చెప్పఁబడక శృంగారరసము చెప్పఁబడెను.

(15) అలంకారములేనియర్థము నిరలంకృతి.

ఉ. "నీచుఁడు సభలోపల దుర్వాచాలతనాత్మదోషవంచితుఁడగు"—ఇందు నీచుఁడు ఆత్మదోషవంచితుఁ డగుననుచో నలంకారము పొసఁగదు.

(16) దేశకాలాదులకు సరిపడనియర్థము విరుద్ధము.

అది దేశవిరుద్ధము, కాలవిరుద్ధము, లోకవిరుద్ధము, దిగ్విరుద్ధము, సమయవిరుద్ధము అని పంచవిధము.

ఉ. (1) "మరుదేశంబునఁ బెక్కులు పరిపూరితసలిలనదులు పరఁగి పిపాసాతురులం దనియించు"—ఇందు మరుభూమిని బెక్కునదులు జలపూర్ణములై ప్రవహించెననుటచే దేశవిరుద్ధత్వము దోఁచుచున్నది.

(2) "గ్రీష్మకాలంబు మత్తిల్లి కేకులాడె నింద్రగోపంబు లిలమీఁద నెల్లఁ బొలిచెఁ జాఁగెఁ బ్రథమాంబువులకునై చాతకంబులు"—ఇందు గ్రీష్మమునందు వర్షర్తుధర్మములు చెప్పుటచేత కాలవిరుద్ధత్వము సిద్ధించుచున్నది.

(3) "ఘనగజకుంభంబులతో మొనయుఁ బ్రవాళంబు వెలయు ముత్తెపుగములయ్యెనుఁబోతులకొమ్ములలో"—ఇందు ఏనుఁగుకుంభములతో ప్రవాళము పోలుటయు ముత్తెములు ఎనుఁబోతుకొమ్ములందుఁ బుట్టుటయు లోకవిరుద్ధములు.

(4) "ఉదగంబుధివీచులను న్మదుఁడై క్రీడించె దాక్షిణాత్యుఁడు"—ఇందు ఉత్తరపు సముద్రమునందు దక్షిణదేశస్థుఁడు క్రీడించెననుటచే దిగ్విరుద్ధము.

(5) "అమరఁ గఁబులితోలును మస్తమునం బలుజడలు దాల్చి సౌగతుఁ డొప్పెన్ హిమకరశేఖరుగుడిని"—సౌగతుఁడు పులితోలును జడలును దాల్చుట సమయవిరుద్ధము. ఇట సమయమనఁగా మతము.

(17) జతపడనివాని జతపడునట్లు చెప్పెడియర్థము అసంగతి.

ఉ. "శ్రుతము శాంతియు నితనికిఁ జుట్టలనఁగ, దయయు దానంబు నితనికి దయితలనఁగ" అనుచో శ్రుతశాంతులును దయాదానములును జతపడఁ జెప్పుటయసంగతి. "పరఁగు వెలచేత గగనంబు రుదుగ ఫేనంబుచేత నంబుధి పరఁగున్"—అనుచోట గగనమునకు వెలచేతను అంబుధికి ఫేనముచేతను ప్రకాశవ్యాప్తులు అసంగతములు. (ఇదియే సహచరచ్యుతము).

(18) సిగ్గు మొదలగువానిఁ బుట్టించు నర్థము అశ్లీలము.

ఉదాహరణము పదగతదోషములం దశ్లీలముఁ జూచునది.

## నాయకలక్షణము.

అ॥ ఈ చెప్పఁబడినదోషములు లేనిదియు గుణములుగలదియునైన కావ్యమునకు రసాలంబనులగు నాయకులు నలుగురుగలరు. వారిక్రింద వివరింపఁబడుదురు. (రసము= శృంగారాదిరసము. ఆలంబనులు = చోటయినవారు).

### ౧. శీలాభిజాత్యాభిజాత్యాదిగుణవిశిష్టుఁడు నాయకుఁడనంబడు.

నాయకుఁడు (అధికారి) ఆభిజాత్యము (మంచివంశమునందుజన్మించుట) శీలము (మంచినడవడి లేక మంచిస్వభావము) శాస్త్రార్థపరిచయము, యుక్తాయుక్తములనెఱిఁగెడి

బుద్ధి, యౌవనము, ఉత్సాహము, మనోదార్ఢ్యము, సామర్థ్యము, వితరణము, పరిశుద్ధత్వము, శూరత్వము, ప్రజలయందనురాగము, సత్యము, ధైర్యము, ప్రియోక్తి, మానము, తేజస్సు, యోగ్యవృత్తి, వాచాలత, బహుశాస్త్రానుభవసిద్ధపరిజ్ఞానము, కృతజ్ఞత, దూషకసాంగత్యరాహిత్యము, ధార్మికత్వము, సుభగత్వము, (కోరఁదగినతనము) ఆర్తావనత్వము, ప్రభుత్వము మొదలగువిశేషణములుగలవాఁడు కావలయు.

౨. ధీరోదాత్తాది భేదంబువలన నానాయకుఁడు చతుర్విధంబుగం బేర్కొనంబడు.

అట్టి నాయకుఁడు ధీరోధాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడని నాలుగుభేదములచేతఁ జెప్పంబడును.

3. ధీరుఁడు, గంభీరుఁడు, కారుణ్యుఁడు, స్వయంకృతస్తుతిరహితుఁడు నిరహంకారుఁడునైన నాయకుఁడు ధీరోదాత్తుఁడనంబడు.

అందుఁ దాలిమిగలవాడును ముఖవికారాదులచేతఁ దనమనసులోని సంతోషాదుల కలిమిని వెలిపుచ్చనివాఁడును దయగలవాఁడును తన్నుఁబొగడుకొననివాఁడునునగు నాయకుఁడు ధీరోదాత్తుఁడు అనఁబడును.

ఉ. "ఉ॥ మ్రోయనివార్ధి నెత్తురులఁబ్రుంగనిరాముఁడువంకవిల్లుగాఁ, జేయనిపైఁడికొండతనుఁజెప్పమదింపనిపెద్దయెట్టిచోఁ, బాయనినిక్కువంబులకుఁబట్టుధరిత్రిఁజలుక్యవిశ్వభూ, నాయకుఁడమ్మహాగుణసనాధునుదాత్తతయొప్పనెప్పుడున్"—ఇందు మ్రోయనివార్ధి యనుటచేగంభీరత్వమును, నెత్తురులఁబ్రుంగనిరాముఁడు అనుటచే అనాయాసముగా శత్రువులను గెలుచుసామర్థ్యమును, వంకవిల్లుగాఁజేయని పైఁడికొండయనుటచేత ధీరత్వమును, తనుఁజెప్పమదింపని పెద్దయనుటచేత తన్నుఁబొగడుకొనమియు, నిక్కువంబులకుఁ బట్టు అనుటచేత సత్యమునుగలవాఁడనుట దెలుపఁబడియెను. గ్రంధాంతరములందు సత్వాఢ్యత్వాది విశేషగుణములు దెలుపఁబడియెడి. (సత్వాఢ్యత = సుఖదుఃఖాదులకు లోనుగాని స్వభావము).

౪. అతికోపనుఁడు, నతిమత్సరుఁడు, నతిగర్వియు, సత్యహంకారబలాన్వితుఁడు, నాత్మశ్లాఘాచతురుఁడును, జంచలచిత్తుఁడునగు నాయకుఁడు ధీరోద్ధతుఁ డనంబడు.

మిక్కిలి కోపముగలవాఁడును, మిక్కిలి యోర్వలేనితనముగలవాఁడును, మిక్కుటమైన మదముగలవాఁడును, మిక్కుటపుఁ బెద్దఱికముగలవాఁడును, తన్నుఁబొగడుకొనుట

యందాసక్తిగలవాఁడును నిలుకడలేని బుద్ధిగలవాఁడునగు నాయకుఁడు ధీరోద్ధతుఁడు అనఁబడును.

ఉ. ‘‘మ॥ ధరసర్వంకషగర్వముక్ బిరుదమాత్సర్యప్రవిధ్వంసముక్ । బరభూపాలపలాయనప్రకటనప్రౌఢంబుఁ గ్రోధోదయా । కరముం గ్రూరము నై చళుక్యవిభుఁ ను గ్రవ్యగ్రకేతుస్థితాంబరఖేలత్కరవాలభైరవసురూపంబొప్పఁ బోరాటలక్.’’—ఇందు క్రమముగా గర్వమును మాత్సర్యమును ఆత్మశ్లాఘయు కోపమును జెప్పఁబడియెను. ఇవిగాక క్రౌర్యమును మాయయుఁ గొన్నియెడలఁ జెప్పఁబడియున్నవి.

౫. స్మరభీతుఁడును స్త్రీపరవశుఁడును భోగాసక్తుఁడును సుందరుఁడునగు నాయకుఁడు ధీరలలితుఁడనంబడు.

మన్మథభీతిగలవాఁడు (మిక్కిలి మోహమునొందువాఁడు) స్త్రీలతోఁ జేరి చొక్కుచుండువాఁడు పూదండలు పరిమళచందనము మొదలగువానివలని సుఖానుభవమును గోరువాఁడు చక్కఁదనముగలవాఁడునగు నాయకుఁడు ధీరలలితుఁడు అనఁబడును.

ఉ. ‘‘చ॥ అరుదగురాజ్యతంత్రమునయక్రియ చేతికి నిచ్చి విశ్వభూ । వరుఁడఖిలాంగసుందరియువారణయానయు నిత్యదృష్టమై । హరయును నై తనర్చు విజయాంగనతోడి దలోకమైనిరం । తరము సుఖించుచుండు నవదర్పకుఁడై సుభగత్వమేర్పడక్.’’—ఇందు రాజ్యతంత్రమునయక్రియ చేతికినిచ్చి యనుటచే నిశ్చింతతయు, విజయాంగనతోడిదలోకమైయనుటచే స్త్రీపరవశత్వమును, నిరంతరము సుఖించుచు ననుటచే భోగాసక్తతయు, నవదర్పకుఁడై యనుటచే సౌందర్యమును క్రమముగాఁ జెప్పఁబడియెను. ఈయుదాహరణమువలన నిశ్చింతత (రాజ్యవిషయమైన చింతలేమి) ఒకగుణముగా నిటగ్రహింపనయ్యెను.

౬. సుభగుఁడును శుచియు వివేకియు నభిమానియు మృదువును సద్విజాది వంశసంభవుఁడునగు నాయకుఁడు ధీరశాంతుఁడు.

చక్కఁదనముచేఁ గోరఁదగినవాఁడును పరిశుద్ధుఁడును వివేకము గలవాఁడును మానముగలవాఁడును తిన్నఁదనముగలవాఁడును యోగ్యులయిన బ్రాహ్మణులు మొదలగువారి వంశములందుఁ బుట్టినవాఁడునైన నాయకుఁడు ధీరశాంతుఁడు అనఁబడును. (బ్రాహ్మణులు మొదలగు ననుటచేత వణిక్సచివులు గ్రహింపనగువారు.)

ఉ. ‘‘ఉ॥ శ్రీయుతులై యశేషసమచేతనులై వివిధాగమాదివి । ద్యాయతనంబులై రసికులై సుఖులై తరుణీవిహారపు । ష్పాయుధులై చరింతురుధరామరులట్టులకాదెరాజనా । రాయణదేవుచేఁబడిననచ్చెరువేయభిరామసంపదల్.’’—ఇందు శ్రీయుతులనుటచేత కలిమియు, అశేషసమచేతనులనుటచే వివేకమును, విద్యాయతనంబులనుటచే పాండిత్యమును,

రసికులనుటచేత సరసత్వమును, తరుణీవిహారపుష్పాయుధులనుటచేత సుభగతయు, సుఖులైయనుటచే భోగపరత్వమును, ధరామరులనుటచే బ్రాహ్మణవంశమును జెప్పఁబడియెను. దీనిచే ధీరశాంతనాయకునికి సంపన్నత్వభోగపరత్వ పాండిత్యగుణములును గ్రాహ్యములయ్యెడిని.

ఈనలుగురును శృంగారాదిరసములకు సమానాధారభూతులగు నాయకులు. వీరుగాక కేవల శృంగారరసాధీనులగు నాయకులు నలుగురుగలరు వారెవ్వరనిన.

౭. శృంగారనాయకులు స్త్రీలతోడి విహారదశలనుబట్టి అనుకూలుఁడు శఠుఁడు దక్షిణుఁడు ధృష్టుఁడు ననంబడుదురు.

౮. ఏకపత్నీవ్రతుఁడై ప్రియురాలుకోరినవానినెల్ల నేకొఱఁతయు లేక నొనగూర్చుచు వర్తించునాయకుఁ డనుకూలుఁడు.

ఉ. "శా॥ సద్రాగాన్వితగానొనర్చుఁగరసంచారోపచారంబులన్, భద్రశ్రీపరిలిప్తఁ జేయుసుమనఃపర్యాప్తగావించుయు, క్షుద్రవ్యప్రతిపత్తిచేవసుమతింగాఁజాలబాలించుని, న్నిద్రప్రీతిఁజతుష్కనాథుఁడుధరిత్రీకాంత నెల్లప్పుడున్."—ఇందు సద్రాగాన్వితఁజేయుట మొదలగువానిచేతఁ బ్రియురాలికోరికలనెల్ల నెఱవేర్చుటయు నిర్నిద్రప్రీతియనుటచేత ప్రీత్యతిశయమును దేటపడుచున్నది.

౯. ఒకరికిఁ దెలియనీయక యప్రియముచేసి ప్రియురాలికిఁ బరితాపము పుట్టించు నాయకుఁడు శఠుఁడు

ఉ. "ఉ॥ వల్లభయైనకీర్తిసతివార్తలనిమ్ములవించువిశ్వభూ, వల్లభుఁడర్థమర్థులకు వావిరినిచ్చుటకీరసంబుసం, ధిల్లదులచ్చికేయెడలఁ దీయపుఁజూపులలోనఁగెంపురం, జిల్లనకాకధీరలకుఁ జిత్తమునందొక వింతగల్గునే."—ఇందు కీర్తి కాంతమాటలనువినుట లక్ష్మికి అప్రియమని యెఱుంగునది.

౧౦. పెక్కండ్రు ప్రియురాండ్రయం దొక్కరీతిని మొగమోటముంచి యందఱకును బ్రియముజనింపవర్తించు నాయకుఁడు దక్షిణుఁడు.

ఉ. "మ॥ అరుదెందైనఁజతుష్కవిశ్వవిభు నెయ్యంబొక్కచందంబునన్, గరమొప్పారుచునుండుసైంధవిపయిన్ గాంధారిపైనించుఘూ, ర్జరిపైమాళవిపైవరాటికపయిన్ సౌరాష్ట్రిపైగౌడిపై, సరినేమాటలురాకరాజతనయాశంకామతింజేయుచున్."—ఇందు సైంధవిమొదలుగాఁగల ప్రియురాండ్రనేకులయందు సరినేమాటలురాకయని సమానదాక్షిణ్యముతో ప్రియుఁడువర్తించుట చెప్పఁబడెను.

౧౧. అన్యస్త్రీసంభోగచిహ్నములు స్పష్టముగాఁ దెలిసి మిక్కిలి కోపము నొందిన ప్రియురాలికి జంకక వర్తించునాయకుఁడు ధృష్టుఁడు.

ఉ. "చ॥ ఒరసిచళుక్యభూపతికి నోడినవైరికిఁ గాననంబులోఁ, గరిమదగంధముం గుటిల కంటకరేఖలు ఘుర్మితాంగముల్, సురతవికారలీల్కఁ దలచూపినఁ దత్సతియల్కఁ జెందెఁదద్వరుఁడును దేటగాఁ దెలిపెవక్రతనమ్మదయెన్ని చెప్పినన్."—ఇందు కరిమదగంధము మొదలగువానిని పరిమళచందనాదులవలని చిహ్నములుగా నెంచి ప్రియురాలు కోపించినను పురుషుఁడు జంకక వానివాస్తవస్థితిని దెలియఁజేయుట తేటపడుచున్నది.

౧౨. ఈనాయకులకు విహారాదులందు సహాయులు పీఠమర్ద విటవిదూషక చేటకులనువారు నలుగురగుదురు.

(వీరు నాయకసచివులనంబడుదురు.)

౧౩. నాయకునికంటె నించుక తక్కువైన గుణలక్షణములు గలిగి సర్వకార్యములను జేయఁజాలినపురుషుఁడు పీఠమర్దుఁడు.

ఉ. "ఉ॥ ఆయెడనొక్క నర్మసచివాగ్రణి యిట్లను నోయఖండతేజో యుతయద్భుతంబొకటి చూచితిఁ జూపెదనీకు నాదుచే, ఛాయ నెచూడుమభ్రమునఁ జక్కఁగ నల్లదె నల్లమబ్బులోఁ, బాయవుకొన్ని మ్రాఁకులున్న పాయవుఁ జుమ్మవినాకభూజముల్. చ॥ అనవినినవ్వి సూక్ష్మగతి నారసియారసి కావతంసుఁ డిట్లను."—ఇందు నర్మసచివుఁడు తెలిసికోలేనిదానిని నాయకుఁడు తెలిసికొనెనుగనుక ఈసచివుఁడు పీఠమర్దుఁడయ్యెను.

౧౪. వానికంటెఁ గొంచెము తక్కువైనవాఁడు విటుఁడు. నాయకోపయోగమైన సంగీతాదివిద్యలలో నేదేనొక విద్య నెఱిఁగినవాఁడు విటుఁడనికొందఱు.

ఉదాహరణమూహ్యము.

౧౫. మాటలయు నంగములయు వికారములను గనఁబఱిచి యెల్లప్పుడు నవ్వించుచుండువాఁడు విదూషకుఁడు.

ఉ. నాటకాదులయందు స్పష్టము. శాకుంతలమునందు "ఒకటి ఋషులపని మఱియొకటి అమ్మగారియుత్తరువు. ఏమిచేయవచ్చును అని రాజు చెప్పఁగా మాఢవ్యుఁడు త్రిశంకువుపలె నడుమ వ్రేలుచుండుము. అనెను." ఇందు త్రిశంకువువలె వ్రేలుచుండుమనునది నవ్వుఁ బుట్టించుమాట. ఈ మాట చెప్పినవాఁడు విదూషకుఁడు.

## ౧౬. స్త్రీపురుషులనుగూర్చ నేర్పుగలవాఁడు చేటకుఁడు.

ఉ. “మ॥ లలనాయీయెలనాఁగఁబెండ్లియగువాలాయంబుచేదిక్షమా। తలనాథుండిది నమ్మవేనినిజమంత్రప్రౌఢిరప్పింతునా । నలనాసత్యసమానుఁజూడుమనిపంతంబొప్పమాయాజపా । కలనాదంభముపూనిమానిదిశలాకర్ణించిమజ్జాయనన్॥ మ॥ ఇదిసంధింపఁగవేళయంచువసురాజేంద్రుండునీరంధ్రనీ । రదవార్ప్రతిసీరవెల్వడినతారాభర్తలీలన్లతా । చ్ఛదసంఛాదికఁబాసినిల్చెనెదుటన్.”—ఇందు సన్యాసివేషముదాల్చిన సచివుఁడు మంత్రమనెడి నెపముచేత వసురాజును గిరికాసమీపమునకు రప్పించెనుగనుక ఈ సచివుఁడు చేటుఁడయ్యెను.

వీరుగాక కామశాస్త్రప్రసిద్ధులు భద్రుఁడు దత్తుఁడు కూచిమారుఁడు పాంచాలుఁడని నలుగురు నాయకులుగలరు.

## నాయికాప్రకారము.

## ౧౭. నాయిక స్వీయ పరకీయ సామాన్యయని త్రివిధయగు.

## ౧౮. మంచిస్వభావము క్రమమైన నడవడి యుక్తములయిన సుగుణములు సిగ్గును గలిగిన సద్వంశసంభూతయగుపతివ్రతస్వీయ.

ఉ. “చ॥ అలఘుచరిత్రలన్శుభగుణాన్వితలున్గురుబంధుమిత్రవ । త్సలలునుదర్పహీనలునుధర్మవిధిజ్ఞలరూపసంపదా । కలితలునైనదారికలఁగానికలిత్తురుసంధివేళలన్ । నలినహితేందువంశనరనాథులువిశ్వనరేంద్రభర్తకున్.”—ఇందు అనఘచరిత్రలు మొదలగువిశేషణములవలన మంచినడవడి మొదలగునవియు నలినహితేందువంశ నరనాథులనుటవలన సత్కులమునందలి పుట్టుకయుఁ జెప్పఁబడెను.

## ౧౯. పరపురుషునియందిచ్ఛగలిగి యాయిచ్ఛను మఱుఁగుపుచ్చుటయందాసక్తమయిన మనసుగల నాయికపరకీయ.

## ౨౦. పరకీయ కన్యయని పరోఢయని ద్వివిధయగు.

## ౨౧. యౌవనవతియు సిగ్గుగలదియు వనవిహారాదులందుఁ బ్రియముగలదియు తాను గోరినవరునకిచ్చుమాటలు తనవారాడుకొనఁ గోరునదియునైన పడుచు కన్యయనంబడు.

ఉ. "ఉ॥ స్యాలకఫాలభాగలును సంకుచితస్తనబింబలుఁ బ్రవిక । ల్పాలసబాలలీలలును నల్పవివేకలు నైన వైరిభూ । పాలురముద్దుఁగన్నియలభాగ్యము నెన్నదురర్థివిశ్వభూ । పాలునిరాజ్యలక్ష్మికి సపత్నిక లయ్యెదరంచుఁ బ్రాజ్ఞికుల్॥"—ఇందు స్యాలకఫాలభాగలు మొదలగుమాటలచేత యౌవనాదిధర్మములు తేటపడుచున్నవి. కన్యపిన్నదైనను ఒక పురుషుని వరించునిచ్చచేత గాగముతోఁ జేటంబట్టియు ఆపురుషునిపొందు స్వతంత్రతలేమినిఁ బట్టియు పరకీయనాయికగా గ్రహింపఁబడియెడి.

౨౨. ఒకపురుషునిఁ బెండ్లాడి వానిమనసున కెక్కునడవడితో గృహకృత్యములందు సమర్థురాలై వర్తిల్లుచుండియు, పరపురుషాసక్తి గలనాయిక ప్రౌఢయైన పరకీయ.

ఉ. "సీ॥ పారసీకక్ష్మాపతులచొప్పడఁగించి నేర్పుమీఱఁగ మోహనిద్రవుచ్చి । యవనసేనాధినాయకులవో స్తంభసంభరితప్రతాపదీపంబులడఁచి । యభిభూతఖానమల్కావిష్కృతాయశో ధ్వాంతసంతతి కాత్మసంతసిల్లి । సముదమ్మఱితురుష్కప్రాంతసీమల నడుగు మోవఁగనీకయరుగుదెంచి । ప్రాజ్యసామ్రాజ్యయగువారిరాజ్యలక్ష్మి । కదనసంకేతమున జారకాంతయగుచు । నంచితస్ఫూర్తి నిన్ను వరించె నార । వైరిగజసింహ యోబయ నారసింహ॥"—ఇందు క్రమముగా మొదటిపాదమునందు స్వభర్తను నిద్రపుచ్చుటయు, రెండవపాదమునందు దీపము నార్చుటయు, మూడవపాదమునందు చీఁకటివేళ సంతోషముతో బయలుదేఱుటయు, నాలవపాదమునందు భయములేక చీఁకటిలో సంకేతస్థానమునకు వడిగా నడచిపోవుటయు నను జారస్త్రీలక్షణములు చెప్పఁబడెను అని తెలియునది. ఇటిధర్మములుగల జారస్త్రీ నాయికలలో నెన్నఁదగినది కాదని కొందఱు సత్ప్రబంధములందు పరోఢను గ్రహింపరందురు.

౨౩. సంగీతము అభినయము మొదలగువిద్యల నెఱిఁగి యత్యాసక్తిఁ గలదానివలెఁ గపటలీలామాధుర్యముఁ గనఁబఱుచుచు నించుకేనియుఁ దనయభిప్రాయమును వెలిపుచ్చక వర్తించు భోగముదియైననాయిక సామాన్య.

ఉ. "అనిఁ బరగండభైరవభుజాసి వడిం బడి పుణ్యమూర్తులై । వినుతగతిం జరించు బలవీరులఁ గైకొని యొద్దఁ గారుము । న్ననఁగి పెనంగి కూర్చు సువిటావళులందొలఁగించి రప్సరో । వనితలు పైఁడి వెట్టి నిలువంగలవే వెలయాండ్రకూరుముల్॥"—ఇందు పైఁడి వెట్టి నిలువఁగలవే

అనుటచేత ధనమిచ్చునంతవఱకుఁగూడ భోగము దాని ప్రేమమునకు నిలుకడలేమి తెలుపఁబడియెను.

## ౨౮. అందు స్వీయ ముగ్ధ మధ్య ప్రగల్భ యని త్రివిధయగు.

(1) యౌవనము కలుగఁగానే రతిననుసరించిన శృంగారచేష్టలేవియు నెఱుఁగక సిగ్గుతోడి మనోజ్ఞప్రవర్తనముతో వర్తించు నాయిక ముగ్ధ.

ఉ. "శా॥ ఆలాపంబునకుత్తరంబొసఁగదాయాసంబునం గానితా। నాలోకింపదు పాటలాధరమరందాస్వాదసమ్మగ్నముం। దాళంజాలదు కౌఁగిలియ్యదు తనూతాపంబు చల్లాఱఁగా। నేలజ్జావతితద్రతంబు దయితాభీష్టంబు గాకుండునే॥"—ఇందు ఉత్తరంబొసఁగదు ఆలోకింపదు తాళఁజాలదు కౌఁగిలియ్యదు అనుమాటలచేత శృంగారచేష్ట లెఱుఁగమియు సిగ్గు కలిమియు తేటపడుచున్నవి.

(2) యౌవనమునకుఁదగిన కామసంపత్తియు యథోచితలజ్జయు క్రీడాసక్తియుఁగల నాయిక మధ్య.

ఉ. "సీ॥ ప్రహసోన్నతసమాయతాంగవిస్ఫూర్తిపైనిబిడలావణ్యంబునిట్టట్రోవ। నేపథ్యశృంగారనియమితరచనపైఁదారుణ్యసంపత్తితళుకులొత్త। మిళితరాగాభోగ మృదుగల్లపాళిపై సమ్మదోద్రేకంబుజాలువాఱ। లాలితలజ్జావిలాసంబుపై సాంద్రకందర్పదర్పంబు కందళింప। నుబ్బునుల్లంబుచనవులనుగ్గడింప। నెల్లయైమధ్యపేశ్వేశ వల్లభుండు। భావజక్రీడఁగవగూడిపరిణమింత్రు। విమలహేమంతశిశిరకాలములయందు॥"—ఇందుఅంగవిస్ఫూర్తి యనుటచే యౌవనమునకుఁదగిన అవయవవికాసమును, తారుణ్యసంపత్తియనుటచే యౌవనాభివృద్ధియు, సమ్మదోద్రేకమనుటచే రతియందలియుత్సాహమును, లజ్జావిలాసమనుటచే యథోచితలజ్జయు, కందర్పదర్పమనుటచే కామసంపత్తియుఁ దోఁచుచున్నయవి.

(3) నిండినయౌవనమును కామావేశబుద్ధియు మన్మథవ్యాపారచతురతయు రతియందు లయించినమనసుగలిమియుఁగలనాయిక ప్రగల్భ (ప్రౌఢ).

ఉ. "సీ॥ పయ్యెదకొంగులోపలఁబిక్కటిల్లెదు నివ్వెఁగుఁజన్నులనిండుసొంపుఁ। దళుకుతోలజ్జకుఁదలమీఱి క్రాలెదు నిడువాలుఁజూపులనిశితగతియుఁ। బ్రణయానురాగసంపత్తిలోఁగొంకకమున్నాడియే తెంచు మొక్కలంబు। నొడికంపుఁజేతలయొఱపెఱింగినవింత పోడ్పాటుపనిగలవేఁగుఁదనముఁ। గలిగితమకించునెడలఁబ్రగల్భఁదగిలి। వేడ్కవిహరించుఁ జాళుక్యవిశ్వవిభుఁడు। చారువర్షావసంతర్తుసమయములను। బాలితాఖిలరాజ్యవైభవమెలర్ప॥"—ఇందు మొదటిపాదమునందు యౌవనపరిపూర్తియు రెండుపాదమునందు లజ్జాన్యూనతయు మూడవపాదమునందు కామావేశబుద్ధియు నాలవపాదమునందు మన్మథవ్యాపారచాతుర్యమును మనోలయమును క్రమముగాఁ జెప్పఁబడెను.

## ౨౪. మధ్యాప్రగల్భానాయికలు ధీర ధీరాధీర యధీర యని మరల ముత్తెఅంగులు గలవారగుదురు.

(1) స్పష్టముగాఁ దప్పుగనఁబడుచున్న నాయకునిఁజూచి వినయములును మృదువులునైన మాటలచేఁ బరిహసించునాయిక మధ్యధీర.

ఉ. "చ॥ లసితములైనలేఁజెమటలంజెలువారెడి మేనితావియున్ । బొసఁగవిలోచనాంతములఁబొంపిరివోయెడివింతరాగమున్ । వసుమతిగారవించుచు శ్రమంపడకుండినసేఁకల్గునిం । పెసఁగఁగనంచుఁబల్కెఁ దర శేక్షణయోర్తుచళుక్యవల్లభున్॥"—ఇందు లేఁజెమటయు మేనితావియు కన్నుల యెఱ్ఱఁదనమునె పరస్త్రీసాంగత్యమ నెడి తప్పును స్పష్టముగాఁ దెలుపుగుఱుతులని యెఱుంగునది.

(2) ప్రియుఁడు చేసినతప్పును గన్నులారఁజూచి తాలిమిలేకకోపించి కన్నులనీళ్లుగార్చుచుఁ దగిన వక్రపుఁబలుకులు పలుకునాయిక మధ్యధీరాధీర.

ఉ. "చ॥ చతురతవిశ్వభూవిభుఁడుజాదులుమాళవికిచ్చెనిచ్చినన్ । బ్రతిభవహించిలాటిపిదపందనకిచ్చినపాటలంబులం । బతిపయిఁబాఱఁజల్లినవబాష్పకణంబులురాలరోషభాషితయగుచుండెన త్తెఱఁగుచిత్తమునంబరికించియోకదే॥"—ఇందు ప్రియుఁడు జాజులు ముందుగా మాళవికిచ్చి పిమ్మట పాదిరిపువ్వులు తనకిచ్చుటనుప్రత్యక్షముగాఁజూచి కోపించినలాటి ధీరాధీరయని తెలియునగు.

(3) తప్పుచేసినప్రియునిపై నలిగియు ననురాగముచేఁ గన్నుల నీళ్లొలుకఁగా సాభిప్రాయములైనమర్మమునాటెడు పరిహాసపుమాటలాడెడినాయిక మధ్యాధీర.

ఉ. "చ॥ ఒద వెడువేడ్కఁదన్నుమునునూఱడఁబల్కి మొఱంగిచన్నచ । క్కదములురోషబాష్పకణగద్గదభాషలచేతఁజెప్పుచున్ । ముదితచళుక్యవల్లభునిమ్రోలఁదనర్చుటఁజూచి నెచ్చెలుల్ । ముదనునిచేఁతకుందరుణిమానములేఁతకునొచ్చిరిచ్చలన్॥"—ఇందు మొఱంగిచన్నచక్కదములు మర్మము నాటనాడెడు పరిహాసములని తెలియునది.

(4) కోపము కనఁబడనియ్యనిమాటలును బనులును బొందుపడఁదగిన వ్యాపారములవలనఁ దప్పుచేసినప్రియునిఁ గలఁతనొందించునాయిక ప్రగల్భధీర.

ఉ. "చ॥ వెలఁదిపరాంగనాప్తుఁడగువిశ్వనృపాయునిఁజూచుచూం । పులుపచరింపదయ్యెమణిపుత్రికఁజూచుటకారణంబుగాఁ । జిలుకకునత్తటింజదువుచెప్పుకతంబునఁబల్కదయ్యెఁదొ । య్యలియొదురేగదయ్యెఁగలహంసికినెన్నడఁజూపుచుండుటన్॥"—ఇందు మణిపుత్రికఁజూచుట చిలుకకుఁ జదువుచెప్పుట కలహంసకునడనేర్పుట అనుపనులు పొందు

పడఁగా ప్రియునిఁజూచుట ప్రియునితో మాటలాడుట ప్రియు నెదురుగ్కొనిపోవుట అను పనులవలనఁ బ్రియునిఁ గలఁతపెట్టుటయని తెలియవలయు.

(5) తప్పుగల ప్రియునిఁజూచి కోపమును అధైర్యమునుగనఁబడునట్టి మాటలాడు నాయిక ప్రగల్భ ధీరాధీర.

ఉ. “మ॥ అతివా నాకుఁజళుక్యనాథుచతురవ్యాపారముల్ విన్నసం । తతమోదం బుజనించునంతటనఘూర్త క్రీడలాలించినన్ । బ్రతిపన్నంబగుఁగోపమప్పుడటుసోత్ప్రాసోక్తిఁకింజొచ్చినన్ । హితమంద స్మితమబ్బు మోమునకు మున్నీకౌతుకం బెట్టిదో॥”—ఇందు చతురవ్యాపారములచేత మోదమును ఘూర్తక్రీడలువినుటచేతఁ గోపమును సోత్ప్రాసోక్తిఁ జొచ్చునప్పుడు మందస్మితమును గలుగుననుటచే కోపమును అధైర్యమును ఊహించుకొనవలయు.

(6) ప్రియుఁడు తనకోపమును మాన్చునపుడతనిను పేక్షించి పిమ్మట నాప్రియునిఁజేరియూరార్చు నాయిక ప్రగల్భాధీర. ।

ఉ. “శా॥ ఆపంచాయుధు పెంపు నాహిమకరాహంకారమాకోకిలా । టోపంబుం దరియింపలేక సతినిండుంగూర్మితో ధైర్యసీ । మా పర్యాప్తికి నెగ్గుగా మణిరణన్మంజీరపుంజీకృతి । త్సోపత్రాతము చూడ మ్రొక్కితలఁచెంజాళుక్యవిశ్వేశ్వరున్॥”—ఇందు మన్మధాదుల వలని బాధను సహింపఁజాలనిదై ప్రియుని మ్రొక్కితలఁచెననుటచేత మందతనిను పేక్షించి పిమ్మట విరహవేదనసహింపలేక ప్రార్థించుట యూహ్యము. ।

**౨౬. ఈమధ్యాప్రగల్భానాయికలు జ్యేష్ఠకనిష్ఠయనుపేళ్లచే మరల ద్వివిధ లగుదురు.**

మిక్కుటమయిన ప్రియునిప్రేమమునకుఁ బాత్రురాలగునది జ్యేష్ఠయు, అట్టిది కానిది కనిష్ఠయునని తెలియవలయు.

**౨౭. మఱియు శృంగారరసాశ్రయలగు నాయికలెనమండ్రుగలరు.**

**౨౮. వారు స్వాధీనపతిక ఖండిత ప్రోషితప్రియ విరహోత్కంఠిత అభిసారిక కలహాంతరిత సంప్రవాదిని (విప్రలబ్ధ) వాసకసజ్జిక నాఁబడుదురు.**

(1) ఇంపుగా ననువర్తించు ప్రియుఁడుగలదై యతనిచే నియ్యఁబడునట్టి యాభరణాద్యలంకారములచేతఁ బ్రసిద్ధురాలగు నాయిక స్వాధీనపతిక.

ఉ. “మ॥ ప్రతిపక్షప్రతిపాదితక్షతులు మాపం జెప్పతే వెన్నుఁడున్ । బ్రతికాల స్వకృతోత్సవాభరణభద్రశ్రీవిమిశ్రక్రియా । చతురత్వంబెలరారు మందు నెపుడుంజాళుక్య

విశ్వేశ్వరుం । బలిగానొసఁగినరత్నగర్భయనులాభంబొప్పఁబోపృథ్వికిన్ ।."—ఇందు రత్నగర్భయను లాభంబొప్పుననుటచే ప్రియునిచేనియ్యఁబడిన యాభరణాదులచేఁ బ్రసిద్ధురాలగుటయుఁ దక్కినవాక్యములచే ప్రియుఁడు స్వాధీనుఁడగుటయు నూహ్యములు.

(2) రాత్రియంతయు నన్యస్త్రీతోఁ గూడియుండి తెల్లవాఱఁగానే సంభోగచిహ్నములతోఁ దనయింటికివచ్చిన భర్తనుపీడనాడు నాయికఖండిత.

ఉ. "శా॥ నారుస్పర్శపమీరసూచితతనూసౌరభ్యమింపారఁగా । శ్మీరీసంగమశంసియైనఁగని గాసిల్లెంబ్రకాశాంగజా । కాసంధైవిలసిల్లువిశ్వవిభుపైఁగర్ణాటికా శ్మీరితో। నారాజాస్య నెఱుంగదచ్చెరు వెదేశ్యామోచఖేదంబిలన్."—ఇందు కాశ్మీరీసంగమశంసియైనఁగని కర్ణాటి విశ్వవిభుపై గాసిల్లెననుటచే ఖండితాత్వము సూచితము.

(3) ప్రియుఁడు పరదేశమునకుఁబోయి మరలగాక తడయుటచే సంకటపడెడి నాయిక ప్రోషితపతిక.

ఉ. "ఉ. శ్రీశుఁజళుక్యవిశ్వనరణీశుభజింపఁదలంచిచన్నయా । త్మేశుఁడువచ్చునంతకుఁబురేందిరకుంబ్రభవించెఁదోడువ్రా । నాశలమాఁగుపాటుమలినాంబరభావముసంగవర్ణసం । క్లేశవికారమున్ నిరవలేపతయున్ సుమనోవిముక్తియున్."—చన్నయాత్మేశుఁడు వచ్చునంతకు ఆశలమాఁగుపాటు......సుమనోవిముక్తియున్ ప్రభవించెనుటచే ఇందు ప్రోషితభర్తృకాత్వము సూచితము.

(4) అనురాగము గలవాఁడయ్యును ప్రియుఁడు కార్యాంతరప్రతిబంధకముచేత నింటిరానియెడ నాతని యెడఁబాటునోర్వక రాత్రియంతయు విచారగ్రస్తయగు నాయిక విరహోత్కంఠిత.

ఉ. "చ. సవరతగీతవాద్యనటనంబురుచించినరాకతక్కనో। వివిధకవిప్రబంధరసవీచులఁదేలితలంపఁడయ్యెనో । గవయగురాచకర్జములుగల్గెనొగాక చళుక్యమేదినీ । ధవుఁడిటులేటికిందడయుఁడారలు వెల్లఁదనంబుఁగూరెడున్."—ఇందు మొదటి మూడు పాదములందును ప్రియుఁడురామికిఁ గారణములూహింపఁబడుటచేతను, నాలవపాదమునందుఁ జళుక్యమేదినీశ్వరుఁడేటికిందడయు ననుటచేతను ప్రియుఁడు అనురాగముగలవాఁడనుట తేటపడుచున్నది. కనుక విరహోత్కంఠితాత్వమూహ్యము.

(5) దిక్కుదెలి[illegible] కటికిచీఁకటియందుఁగూడ తమకమువలన వెనుదీయక ప్రియునిఁ గూర్చిపోవునట్టి నాయిక యభిసారిక.

ఉ [illegible] ఘనాఘనాఘనావళితమున్ గీలాలధారాళమున్ । భయదోద్యచ్ఛతకోటి[illegible] గాసిల్లుఘోరాటలోఁ । బ్రియలీలాచపలావలోకములశోభిల్లుంబ్రసన్నాకృతి[illegible] । జయుమంతినివచ్చి మెచ్చికవయున్ జాళుక్యవిశ్వేశ్వరున్."—ఇందు ఘనాఘనావళితము మొదలగు యుద్ధవిశేషణముల యర్థాంతరముచేత అంధకారముసూచితము. దానియందు వచ్చికవయుననుటచే అభిసారికాత్వమూహ్యము.

(6) ప్రణయకోపము[illegible] ప్రియునితో మాటలాడకయుండి పిమ్మట మన్మథతాపముచే దుః[illegible]చు నాయిక కలహాంతరిత.

ఉ. [illegible]లయ్యైవిశ్వవిభుతో మన నెచ్చెలిరిత్తయల్కకున్ । దెలియఁ

డరాజు దర్పకుఁడు తీవ్రత విల్లు దియెక్కువెట్టెఁ గ్రొ । న్నెల వ్రేడ తెంచె నింకఁ గరణీయము సఖ్యము చేయు నేర్పుతో । య్యలి యలికేందురేఖకును నవ్విభుపాదపయోజలక్ష్మికిన్."—ఇందుతొయ్యలి యలికేందురేఖకును నవ్విభుపాదపయోజలక్ష్మికిని సఖ్యము చేయుట ఇంక కరణీయమనుటచే అంతకుముందు ప్రియుని నుపేక్షించి యుండి యతఁడు కోపించుకొనఁగ సఖ్యము గోరుట తోఁచుచున్నది గాన కలహాంతరితాత్వమూహ్యము.

(7) సంకేతస్థానమునకు రమ్మని దూతికనంపి తన్ను వంచించి రాకయున్న ప్రియునుద్దేశించి

చింతించు నాయిక సంవాదిని. ఇదే విప్రలబ్ధ.

ఉ. "శా. చాళుక్యక్షితినాథ నీవనుపుచున్ సౌరంధ్రి యేతెంచెనీ । వేలో యాలవచేసి రామికి నుండి పొవ్వు సముం బాల్చె నా । యాలాపంబులు నమ్మవేని యును రమ్మా మాతుక నీటిచేఁ । జాలం బంకిలభాగమై నవిలసత్సంకేతసద్మస్థలిన్."—ఇది నాయికను నిగూర్చి చెప్పె దూతికవాక్యము. నా యాలాపంబులు నమ్మవేని కన్నీటిచేతఁ బంకిలభాగమైన సంకేతస్థానముఁ జూతువు రమ్మనుటచే విప్రలబ్ధాత్వమూహ్యము.

(8) ప్రియుఁ డలంకరించుకొని యింటికి వచ్చుట నెఱిఁగి తాను నలంకృతురాలై

యాతని రాక కెదురుచూచు నాయిక వాసకసజ్జిక.

ఉ. "మ. పరిలేపస్ఫుటహేమకుంభకుచయుక్ ప్రాలంబముక్తాఫలా । బరవిభ్రమజితమూర్తియుక్ వికచపుష్పస్రగ్వితానాంతర । స్ఫురితాకారయునై వెలందుక కడున్ శోభిల్లె విశ్వావనీ । వసుఁడేతెంచె జయాస్తతోన నెమ్మసవ్యాస్తావిశేషప్రశస్తితిన్."—ఇందు జయాస్తతో విశ్వావనీశ్వరుఁడు వచ్చెనన్న వార్తవిని వస్త్రాభరణ లేపనాదులచే నలంకృతురాలయ్యె ననుటచే వాసకసజ్జికాత్వమూహ్యము.

వీరికి దూతికలు ప్రాతివేశిని, సఖి, ధాత్రేయి, చేటి, లింగిని, శిల్పిని, దూతి, దాసి అని యెనిమిది భేదములు గలవారగుదురు. ఈ పేరుల ననుసరించి వీరిలక్షణము లూహిమునది.

మీఁదఁ జెప్పఁబడినవారు గాక కామశాస్త్రప్రసిద్ధలయిన నాయికలు నలుగురు గలరు. వారు పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని అనఁబడుదురు. ఈ నాలుగుజాతుల నాయికలకును వరుసగా పురుషజాతులైన పాంచాలుఁడు కూచిమారుఁడు దత్తుఁడు భద్రుఁడు అనువారు నాయకులగుదురు.

వీరిస్వభావలక్షణాదులు కామశాస్త్రమువలన నెఱుంగఁదగినవి

ఇది నాయకప్రకరణము.